


చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౨౪

ఆంధ్ర సంపుటము ౧. రుధిరోద్గారి సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨.

# గాంధి శతకము

మంగిపూడి వేంకటశర్మ గారు

...రాతదయ కాలవాలము
నీతికి నిధి నిత్యసత్యనియతి నెలవు వి
స్ఫీతసుశీలముఖుని భవ
...కాతరులకు రక్ష గాదె గాంధిమహాత్మా.

చె ...రెటం జక్రవర్తులు
...జకీకి బహురాజనీతివిద్యావిదుల౯

క. పణతులును శస్త్రశాస్త్రము
ఫణితు లెఱిగి సాహసమున బగతురశిర
ముల్ పుణికి యగణ్యపు గణ్యాల
గణియించి వెలుంగలేదె గాంధిమహాత్మా.

క. తనమాంస మిచ్చె నొక్కఁడు
తనవెన్నెముకిచ్చె నొకఁడు తనువొకఁడిచ్చెన్

క. శాపానుగ్రహశక్తులు
తాపసచంద్రులు పతివ్రతలు సుకవీంద్రుల్
దీపించిరి మున్నిచ్చటఁ
గాపురుషుల గుండెలదర గాంధిమహాత్మా.

క. చీమలకు హాని సేయరు
పాముల బెబ్బులులఁ జంప భావింపరు ప్రో
ద్దామదయాభామయశః
కాములుగద భరతసుతులు గాంధిమహాత్మా.

క. తనుఁ జంప వచ్చు శత్రువు
తనచేతనె భంగ మొందఁ దను శరణన్నం
తనె యభయ మిచ్చి ప్రోచెడు
ఘనులార్యులు గాక కలరె గాంధిమహాత్మా.

క. తన ధనముఁ దనదు ప్రాణముఁ
దన మానముఁ గూడ మదినిఁ దను నమ్మినయా
తని కై యర్పణఁ జేసెడు
ఘనులొండొక భూమిఁ గలరె గాంధిమహాత్మా

క. తన సామ్రాజ్యముఁ దన సతిఁ
దనసుతు సత్యమున కిడు వదాన్యోక్తమును
క్కని లోక మెల్ల వెదకినఁ
గనఁ గలమే యిందుఁ గాక గాంధిమహాత్మా.

క. తన రాజసుతుని ప్రాణా
వనమునకై తనదు సుతుని ప్రాణము బలియి
చ్చిన యంగనామణుల భువిఁ
గనఁ గలమే యిందుఁ గాక గాంధిమహాత్మా.

క. తనబిడ్డల నిద్రాణులఁ
దునిసినఘనుఁ దునుముని విభుని శో మొఱలిడి

క. భారతవర్షము తత్త్వమె
మారె నిటీవలను దాని మార్చితివౌరా
కోరి యహింసాధర్మము
గారవమున బోధసేసి గాంధిమహాత్మా

క. చోరుల జారులను దురా
చారులఁ గ్రూరులను సుగుణసంపన్నమ
దారులఁ జేసితి వౌరా
గారవమున జ్ఞాన మిచ్చి గాంధిమహాత్మా

క. రాగాంధుల భోగదురు
ద్యోగుల లోభోపహతుల దుర్మతుల మ
త్యాగమతులఁ జేసితి వౌ
జ్ఞాగరిమన్ నీవు మరల గాంధిమహాత్మా

క. ఇల ధర్మరాజొకండే
యలరారె నజాతశత్రుఁడనఁగా నిపు డీ
వలరితి వజాతరిపుఁడవు
కలియుగమున నెంతవింత గాంధిమహాత్మా

క. ఇల నైన యాత్మబల ము
జ్జ్వలమయ్యెన్ భరతభువిని భవదీయ
బలము మహత్త్వము నెన్నం
గలమయ్యా నిర్మలాత్మ గాంధిమహ

క. శోధించి యహింసాపర
మోధర్మ యటన్న సూక్తి ముఖ్యమట
బోధించి యాచరించితి
గాథలు పెక్కులమాకు గాంధిమహ

క. గుజరాతియందు భగవ
ద్భక్తజనావాసమునఁ బోరుబందరున

అనఁగా నాకారమునకు సమమగు తెలివియు, [బు]ద్ధికి సరియగు విద్యయు, విద్యకు సదృశమగు కార్య[ము]ను, కార్యమునకుఁ దగినఫలమును, నామహారాజునకుఁ [గలుగుచుండె]నని భావము.

## ప్రజానురాగము

ఆనాఁటిపాలకులకుఁ బాల్యులపైఁ గల ప్రేమాతి[శ]యమును గనుఁడు.

శ్లో. ప్రజానాం వినయాధానా ద్రక్షణా ద్భరణా దపి
స పితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః.

అనఁగా ప్రజల విద్యావినయసంపన్నులనుగాఁ [జే]యుట, వారినిఁ జోరభయాదులనుండి కాపాడుట, [వా]రి కన్నవస్త్రాదుల నొసఁగి రక్షించుటలోనగు నతని రాగ[చ]రితము లగు కృత్యములచే నాతఁడే, ప్రజకు నిజ[మ]గు తండ్రి యనియు, వారినిఁ గన్న తలిదండ్రులు [కే]వలజన్మకారణు లనియుఁ, దెలుపఁ బడెను. మఱియు,

శ్లో. ప్రజానా మేవ భూత్యర్థం స తాభ్యో బలి మగ్రహీత్
సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః.

అనఁగా సూర్యభగవానుఁ డేరీతిగాఁ దాను గ్రహించినదానికంటె వేయిరెట్లధికముగాఁ దిరుగ వర్షించుటకే భూమినుండి రసమును దీసికొనుచున్నాఁడో ఆ విధముగానే యామహారాజు ప్రజానంపద నభివృద్ధిఁ జేయుటకే వారినుండి పన్నుల గ్రహించుచున్నాఁడు. కా... కేవల ధనకాంక్షచేఁ బ్రజలఁ బీల్చి పిప్పిచేయుట ... శ్లోకార్థములఁ బరిశీలింప నానాఁటి రాజమార్తాండులు ప్రజాక్షేమమునకై యెన్ని యనాథశరణాలయములఁ గట్టించి యుందురో, యెన్ని కళాశాలల స్థాపించి యుందురో, యెన్ని వైద్యాలయముల నెలకొలిపి యుందురో, యెట్టి కృషివాణిజ్యసౌకర్యముల నేర్పఱచి యుందురో, మఱెట్టి సదుపాయముల సాగించియుందురో, తెలియఁదగును.

## నటవానుకూలత

దిలీపమహారాజు పుత్రార్థియై వసిష్ఠమహర్షి యాశ్రమమునకుఁ బోవునప్పుడు సకల రాజ్యభారమును

## ప్రకృతి వర్ణనము

దిలీపుఁడు కోసలపురిని వీడి వసిష్ఠాశ్రమమున కేగునప్పుడు మార్గమధ్యమున నున్న శ్రోత్రియాగ్రహారములఁ గనుఁగొనుచు, గొల్లగూడెముల నరయుచు, మునిపల్లెల దర్శించుచు నిట్లు ప్రయాణమును సాగించెను. కవి యిట వనమార్గమున ప్రకృతిసౌందర్యమును నిరూపించుచు మనోహరముగా వర్ణించెను. కనుఁడు.

శ్లో. శ్రేణీబద్ధా న్వితన్వద్భి రస్తంభాం తోరణస్రజం
సారసైః కలనిర్హ్రాదైః క్వచి దున్నమితాననౌ.

అనఁగా స్తంభములు లేని తోరణమాలలవలె నింగిని బారులుదీరి చెవి కింపగునట్టుల ధ్వనులు చేయుచున్న బెగ్గురుపక్షులయొక్క పంక్తులను దలయెత్తి చూచుచు, ప్రయాణమును సాగించెను అని వర్ణించెను. ఈ భాగమున నిట్టి రమ్యమగు శ్లోకములు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతిచే విడిచితిని.

## ఆశ్రమ వర్ణనము

కవి యొనర్చిన వసిష్ఠాశ్రమవర్ణనమును చదువునప్పుడు పాఠకుని కంటికి శాంతమగు నాశ్రమముయొక్క సహజరమ్యత గోచరమగుచుండును. ఆ భాగము నుండి యొక పద్యమును నుదాహరణముగా నిచ్చుచున్నాఁడను.

శ్లో. ఆకీర్ణ మృషిపత్నీనా ముటజద్వారరోధిభిః
అపత్యైరివ నీవార భాగధేయోచితై ర్మృగైః.

అనఁగా నీవ్వరిధాన్యముయొక్క భాగమును పొందుటకు హక్కుగలట్టియు పర్ణశాలలయొక్క గుమ్మములకడ నడ్డుగ నిలిచినట్టియు ఋషిభార్యలచేఁ బుత్రులవలెఁ బ్రేమింపఁబడుచున్నట్టియు, లేళ్లతో నిండియున్న యాశ్రమమునఁ బ్రవేశించెనని భావము.

దిలీపమహారాజు కులగురునితో తనకు సంతతి లేదని వగచుచు చెప్పినవాక్యములు కొండలనుఁగూడ గరగించుననుటకు సందియము లేదు.

దిలీపుఁ డొకప్పుడు స్వర్గమునఁ గొంతకాల ముండెను. ఆ సమయమున స్వేచ్ఛావిహారానుకూల లగు

పెద్దలఁ బూజించుట

" ప్రతిబధ్నాతి హి శ్రేయః పూజ్యపూజా వ్యతిక్రమః "

అనఁగాఁ బూజనీయులఁ బూజింప కుండుటవలన నెంతటి మహారాజులకును గూడ కార్యభంగము కలుగు నని భావము. ఈ సర్గములోఁ జేయఁబడిన సందీనవర్ణన మానందదాయకముగా నున్నయది. ఇంకని ప్రతిసర్గమును మెచ్చికొను ముచ్చటింపకల దుఃవనియే, నాకుతూహలము. వ్యాసము విపులమగు నని తలఁచి యిప్పటికి ప్రథమసర్గ ప్రశంసతో నీ యుపన్యాసమును ముగించుచున్నాను.

కాని సహజమగు కవిత్వమాధుర్యమును బ్రకటించు పెక్కువిషయములు మిగిలిన 18 సర్గములలోఁ గలవు. వాని నన్నిటినిఁ గ్రమముగా ముందు వివరించెద మొత్తముమీఁద నుత్తమపురుషుల కుండవలసిన గుణవిశేషము లన్నియు, మనసునకు నాటున ట్లెన్నియుఁ సంపూర్ణముగా విశదీకరింపఁబడి యున్నవి. ఇట్టి కావ్యములఁ బఠించిన మానవుఁడు నిక్కముగ మానవుఁడై, మానవీయమగు నడుమును సంశయ మింతయును లేదు. ఆంధ్రకవులు గూడ నిట్టి ఘనకావ్యముల వ్రాసి మన యాంధ్రసారస్వతమును వృద్ధిలోనికిఁ దెత్తురు గాక.

---

# ఏమిచేయుచునుండునో యింటిలోన?

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. ఏ. బి. యల్.

వచ్చెం జల్లఁ గులాయముల్ సట్టిపోవు
చల్లఁగా మెల్లఁగా వచ్చెఁ జందమామ
ఏమి చేయుచునుండునో యింటిలోన
నాదు జానకినారతనాలబొమ్మ?
పలుకుపలుకున రాగంబు లొలుకుచుండ
ప్రాణవిభుతోడ గూటిలో బాసలాడు
పులుఁగుజవరాలి మాటల కులికిపడునొ?
నాదుజానకి నారతనాలబొమ్మ!
తారకావిస్ఫుటాకృతహారరచిత
ప్రవిమలాకాశనిత్యకావ్యంబులోన
విరహిజనచిత్రంబు లరయునేమొ?
నాదుజానకి నారతనాలబొమ్మ!
సామ్యలీలలఁ దలపోసి సఖ్య మెంచి
[illegible]

లేతగొంతున గోపికాగీతములను?
నాదు జానకి నారతనాలబొమ్మ!
చిరవియోగభారంబునఁ బరితపించు
నన్నుఁ జూచిన చందురు కన్ను జూచి
వలపుచెలికాని వేదన తెలిసికొనునొ
నాదుజానకి నారతనాలబొమ్మ!
వెన్నెలలఁజూచుచొక్కి-తకన్నుమూయ
సిగ్గు తెరఁ జీల్చి ప్రణయంపుసిగ్గు తేల్చు
కలల హృదయేశు కౌఁగిటనిలుచునొక్కొ?
నాదు జానకి నారతనాలబొమ్మ!
భావసుందరపుష్పదంపతుల నూత్న
ప్రణయపరిమళంబులను పీవనల వీచు
వాయువులఁ గాంతు సందేశవార్త వినునొ?

# పావులూరు గణితము

వేమూరి విశ్వనాథశర్మగారు ఎమ్ ఏ

ఆంధ్రులలో పావులూరు గణితము పేరు తెలియనివా రుండరు. ఇప్పటికిని పల్లెకూటములలో పావులూరుగణితము నుండి కొన్ని పద్యములు చదివించెదరు. యకరములు, సెంట్లు సామాన్యప్రచారములోనికి రాని ప్రదేశములలో మల్లన్నగారి క్షేత్రగణితసూత్రములనే కరణా లనుసరించుచున్నారు. ఇట్టి సుప్రసిద్ధమైనట్టియు, మిక్కిలి పురాతనమైనట్టియు పావులూరు గణితమును గురించిన యంశములు ప్రతి యాంధ్రునకును దెలియవలె ననుకాంక్షతో నీ వ్యాసమును వ్రాయుచున్నాను.

ద్రావిడ భాషలలో పావులూరు గణితము మొదట పుట్టిన శాస్త్రగ్రంథమని చెప్పవచ్చును. ఇది రమారమి వేయిసంవత్స ... నాటి గ్రంథము. పావులూరు గణితమునకు మాతృక గణితసారసంగ్రహమను సంస్కృత గ్రంథము. దీనిని రచించినది మహావీరాచార్యుఁ డను జైనమతాచార్యుఁడు. ఈతఁడు రచించిన నూటయేబది సంవత్సరము ... లో పావులూరు మల్లన ఆ గ్రంథమును సమగ్రముగ నాంధ్రమున ననువదించుట గణితశాస్త్రము నందు తెలుఁగువారికిఁ గల యభిరుచిని జాటుచున్నది. రమారమి యీ

పావులూరి గణితము మల్లన్న వ్రాసిన గణితశాస్త్రముయొక్క మొదటిపుస్తకమునకే పేరు. తన జన్మభూమి యగు పావులూరు ప్రాంతముల వాడుకలో నున్న మానములను (తూనికలు, కొలతలు మొదలగునవి) వర్ణించుటచేత ఈ మొదటిభాగమునకు పావులూరి గణిత మని పేరుబెట్టెను. ఈ భాగము సంస్కృతమున కనువాదము గాని తర్జుమా కాదు.

నూటయిరువది సంవత్సరముల క్రితము "బెంజమన్ హైన్" అను నతడు సామర్లకోటలో కంపినీ యేజంటుగా నుండెను. అతడు పావులూరి మల్లన్న గణితములోని క్షేత్రగణితమును ఇంగ్లీషులోనికి తర్జుమా చేసెను. అప్పటికే యీ గణితశాస్త్రములో ప్రవీణత నెందిన కరణా లరుదుగ నుండి రనియు, ఒక సంవత్సరము ప్రయత్నింపగా బందరు సమీపమున నొకవృద్ధబ్రాహ్మణుడు లభించె ననియు ఆయనవలన పావులూరిగణితము విషయమై సర్వమును నేర్చుకొని క్షేత్రగణితమును ఇంగ్లీషులోనికి మార్చిరనియు హైను దొరగారు వ్రాసిరి! పావులూరి గణితమును గురించి మన కిప్పుడు తెలియనివిషయములు కొన్ని యుండుటచేత నిచ్చటఆవిషయము కొంచెము వ్రాసెదను.

మా యని యాస్వర్థబ్రాహ్మణుడు
గారికి చెప్పెను. మహావీరాచార్యుని పేరు
త్రము పేర్కొన లేదు. ఇందు దశవిధ
తములు గలవు. అందుచేత మల్లన్న
నవి పదిపుస్తకములు. ఇవి క్రమముగ.

పావులూరు గణితము- ఇందు పావులూరు ప్రాంతముల వాడుకలో నుండిన మానములు, కొలతలు, మొదలగునవి వర్ణింపఁబడినవి.

భాగహారగణితము:—వజ్ర వైడూర్యాది మణుల వ్యాపారములో వాడెడితూనికలు, తూనికలనుబట్టి వెల నిర్ణయించుటను దెలుపును.

సువర్ణగణితము: — వరిపిడిని బట్టియు, తూనికను బట్టియు వెండిబంగారముల నిగ్గు దేల్చు భాగము.

) మిశ్రితగణితము:— దీని విషయము తెలియదు.

) భిన్నగణితము :— భిన్నాంశములు చేసి వస్తువులయొక్క వెల నిర్ణయించుట.

) క్షేత్రగణితము:— భూమికొలత, ఇందు వాడెడి పరిభాషాపదములు, భూమికొలతలలో చేర్చుటకు వీలులేని డొంకలు మొదలగు ప్రదేశములు, కొలతనుబట్టి భూమియొక్క పరిమితి దేల్చుటకు కావలసిన లెక్కల వివరము క్షేత్రగణితమునందు వర్ణింపఁబడినవి.

7) ఖాతగణితము:— చెఱువులకొలత, వాములయొక్క యుపయోగము, కోటలు అగడ్తలు నిర్మించువిధములు, వెల్లువలు రాకుండ కట్టలు పోయు మార్గములు మున్నగునవి యీ పుస్తకములో సవిస్తరముగ వర్ణింపఁబడినవి.

(8) ఛాయాగణితము:— నీడనుబట్టి వస్తువులయొక్క దూరము, ఎత్తు కనుగొనుట.

(9) సూత్రగణితము:— అంక గణితాది శాస్త్రములకు సంబంధించిన చిక్కులెక్కలు తేల్చుటకు సూత్రము లీభాగమునందు చెప్పఁబడినవి. ఉదాహరణము-నిత్యనక్షత్రమును జెప్పుటకు సూత్రము. "గీ॥ చనిన మాసములను చయ్యన రెట్టించి గత దినంబులందు గలయఁ గూడి, యశ్వని మొదలుగ నవి లెక్కబెట్టిన, నిత్యతార వచ్చు నిజముగాను." ఇట్టె "మున్నాటరుపదిమాసలు, నెన్నగ బదియుంగరంబులెంత్తైతో ఘటుం జెన్నాళ్ శీత మడి... నన్నాళ్లకు నుంగరంబు లారాజిచ్చె... అను సమస్యకు "ఒకటి రెండు ... నొనరంగ నాల్గిడి, యవియు బెట్టి నున్నలమరఁ బెట్టి, నూరు బెట్టి పిదప నూటయేబడి బెట్టి, యుంగరముల యెత్తు లెరుగ వచ్చు (?)" అను సూత్రము.

(10) ప్రకీర్ణగణితము:— ఇందు బీజగణి పరికర్మంబులు చెప్పఁబడినవి.

ఈ పదిపుస్తకములు చేరిన గ్రంథమునకు "దశవిధ గణితముల"నియు "సారసం

… వాడుకలో నున్నవి. పాత పెద్ద
…క్షలో "సారసంగ్రహ గణితమునందు
…త్రగణితము సమాప్తము" అనియుండును.
…త్రగణితము తొమ్మిదవ పుస్తకమగుటచేత
…వులూరు గణితము"ను పేరు దీనికి చెల్లదు.
…నటి పుస్తకమునకుమాత్రమే పావులూరు
…మనుపేరు. దీనిని బట్టి చూడగా, "సార
…హ" మను మాతృకయొక్క పేరే మల్లన
…గణిత శాస్త్రసముదాయమునకుఁ బెట్టినట్లు
…డుచున్నది.

ఇప్పటికిని క్షేత్రగణితము పల్లెటూరికర
…ద్ద ప్రచారములో నున్నది. ఆంధ్రదేశ
… భూములు కొలుచుటకు "కుంటలు"ను
…వెడునేల' "పుట్టిభూమి" అను పొలము
– పరిమితి దెలిపెడి సమాసములును
…ని ప్రచారములో నున్నవి.

…సరపాటి కొలత, సింగంపాటి కొలత
…కొలతలో రెండు విధములగు మాన
…డుకలో నున్నవి. ఇప్పటికిని నెల్లూ
… సింగంపుట్టి, కైలుపుట్టియని ధాన్య
… రెండు విధములున్నవి. క్షేత్ర
… ముఖ్యముగ కీసరపాటి కొలతలె
… కీసరపాటి కొలతకు మూలము
… దీనిపొడవు మూడువిధముల తేల్చ
…డువడ్లగింజల పొడవుగాని, బొ
…ధ్యకణుపు యొక్క చుట్టుకొల
…ని, నడిమివేలు యొక్క మధ్య
…లతలో సగముగాని, 'అం
…ము. ఇట్టివి.

32 జేనలు 1 గడ

4 చదరపు గడలు 1 కుంట

దీనికి కీసరపాటి మానమని పేరు. కొందరు దీనిని కేసరిపాటి కొలతని యందురు. కాని యీపేరు సరియైనది కాదు. 'కేసరి' యనునది "సింగంపాటి" కొలతకు పర్యాయపదము కావచ్చును. కీసరపాటిమానమున కా పేరు వచ్చిన కారణ మీవిధముగ చెప్పఁ బడి యున్నది.

కీసరయనునది గ్రామముపేరు. ఆ గ్రామపు వెట్టివాడగు కీసర యనువాడు కులాచార ప్రకారముభూములకొలుచుచుండెను. రాజుగారొకనాడు బ్రాహ్మణులకు భూదానముచేసి కీసరను భూమికొలిచి యిచ్చుట కాజ్ఞాపించెను. ఏకొలత ప్రకారమని కీసర రాజుగారి నడుగగా "నీజానతో కొలువుము"ని రాజు చెప్పెను. కాని కీసర మరిగుజ్జువా డగుటచేత జానచిన్నదై భూమి కొంచెము వచ్చినందున బ్రాహ్మణులు కోపగించుకొనసాగిరి. బ్రాహ్మణుల కోపము మాన్పి పుణ్యము సంపాదించుటకు కీసర తన కుడిచేతియందలి అంగుష్ఠముకు తర్జనికి మధ్య నున్న భాగమును చీల్చి జాన పొడిగించెను. ఈ త్యాగమునకు మెచ్చి నాటినుండియు పైను దహరించిన మానమునకు కీసరపాటి కొలతని పేరు పెట్టిరి.

కీసరపాటి మానమే కాక ఆంధ్రదేశములో నాయాప్రాంతముల వాడుకలో నుండిన కొలతలు గూడ చెప్పఁబడినవి. మధ్యరాష్ట్రము అనఁగా బందరు ప్రాంతములలో [illegible]

| | |
|---|---|
| 12 అంగుళములు | 1 జేన |
| 2 జేనలు | 1 మూర |
| 32 మూరలు | 1 గడ |
| 4 చదరపుగడలు | 1 కుంట |
| 1¼ కుంటలు | 1 కుంచము |
| 2 కుంచములు | 1 ఇరస |
| 2 ఇరసలు | 1 తూము |
| 5 తూములు | 1 ఏదుము |
| 4 ఏదుములు | 1 పుట్టి |

దీనినిబట్టి ధాన్యపుకొలతకును భూమి కొలతకును ఒకేమాన మేర్పడియుండినట్లు స్పష్టమగుచున్నది. ధాన్యపుకొలత కిప్పుడు కూడ పైమానము నెల్లూరిజిల్లాలో వాడుచున్నారు. 'కుంచెడుపాలము' "పుట్టెడునేల" అనుపదములిప్పటికినిసర్వసామాన్యములు. ఇవి చల్లకమునకు సంబంధించిన లెక్కలు. "పుట్టెడువిత్తనాల మాగాణి" యనుట నెల్లూరిజిల్లాలోని యాచారము. ఈ కొలత ప్రకారము పుట్టెడు భూమియనగా కొంచెము తక్కువగ తొమ్మిదిన్నర యకరముల విస్తీర్ణము గలది. కాని భూమికొలుచునప్పుడు గడకు గడకు మధ్యను గోష్పాదమాత్ర భూమి పెచ్చు వదలుట యాచారముండెడిది. ఇవి చేర్చినయెడల పుట్టెడుభూమియొక్క విస్తీర్ణము సరిగా పది యకరము లగును. పైరులు పెట్టుట కదనైన

ఋతువులు భూముల విస్తీర్ణము నను
ఆయాపైరుల చల్లకమునకుఁ గావలసిన విత్త
నముల కొలతలును క్షేత్రగణితమునందున్నవి.

మల్లన్న వ్రాసిన గణితము మహావీరా
చార్యుని గ్రంథమునకు సరియైన ఆంధ్రీకరణ
మని తోఁచదు. సూత్రములుమాత్రము సం
స్కృతము నుండి తెలిగించి యుదాహరణము
లను లెక్కలను కొంతవరకు స్వంతముగ కల్పిం
చినట్లు కనఁబడుచున్నది. ఈ లెక్కలలో
చాలవరకు మన సంఘస్థితులును, ఆచా
వ్యవహారములును వ్యక్తములగుచున్నవి.
చదువుటకు మిక్కిలి మనోహరములుగ
డును. ఈ కారణమును బట్టియైనను మ
గణితశాస్త్రమును సమగ్రముగ సంపా
ప్రచురించినయెడల బాగుండును. ప
ళ్లలో కరణములవద్దను, చెన్నపట్టణమ
ప్రాచ్యలిఖితభాండాగారములోను పా
గణితప్రతులు చాలఁగలవు. ఆంధ్ర
పరిషత్పుస్తకభాండాగారములో
గణితము, ఖాతగణితము, సూత్ర
క్షేత్రగణితము గలవు. ఇవిగాక
తము లను గ్రంథము వేరుగ నున్న
లనుబట్టి సంపూర్ణగ్రంథమును స
దుర్లభము కాదు. ఈ యమ
ప్రకటనము సాహిత్యపరిషత్తా
కులు సమర్థించినచో మిక్కిలి

---

# గవేషణ

వేలూరి చంద్రశేఖరం గారు, బి. ఏ.,

(గత సంచిక శేషము)

౩

జనుల జగతికిఁ గ్రమ్మఱ సత్యకాముఁ
డూర్ధ్వలోకమునుండి నియుక్తుఁ డైన
వానిపోలిక, దుఃఖితప్రాణి కెల్ల
సాంత్వనంబు నొసంగుచు సంచరించె.
అవిటి కాతఁడు కేలూఁత, యంధజనున
కతఁడు కనుదోయి, తలదాఁప నైనఁగాని
ంచ లేనట్టి పేదకుఁ బ్రాపతండు.
రిమ లేరియెడందల విషమునించు
రల కతండు వైద్యు, సంసారయుక్తు
రసి బమ్మెరపోయెడు నట్టివారి
డు సేదోడు, సత్యవీక్షాభిలాష.
జ్వలించు నవ్వారి కతఁడు
ద్రదర్శకుఁ, డీరీతి మనికితంబు
రించుట జీవితవ్రతము గాఁగ
కాముని దినములు జరుగఁజొచ్చె.
ఁద శోకవీచిక లంతరింప
విషఫేనిలమ్ము కాఁ వపుడు పోత;
దశ్రువు లింకిపో, నైనఁగాని
లేఁగాక, తోఁచె మాధుర్యమందు;
రసచే మోము మ్లాన మగుట
ంత ప్రసన్నతఁ బడయఁజొచ్చె;
ఃఖాగ్ని యందున

మించుక యెఱింగికొని యీ ప్రపంచనియతి
కెగ్గు తలపోసి క్రుద్ధుఁడై యెదురుకొనుచు
మోహితుఁడు కాఁడు సత్యకాముండు నేఁడు;
కాని సత్యనిరీక్షణాకాంక్షమాత్ర
మెప్పటట్టులఁ దీవ్ర మాయెడఁదయందు.
నాఁటియట్లు తమాలవనమ్ము చెంతఁ
బూర్ణిమాచంద్ర చంద్రికాభ్యుదయ వేళ
ధ్యానమగ్న మొనర్చె స్వాంతమ్ము నతఁడు.
క్రోధమాలిన్య మెల్ల వీడ్కొలిపియుంట,
వాఁడి యయ్యును మ్రదిమము వడసినట్టి
యతని వేదన పేశలమైన యాని
వేదనమ్మందు మెల్లన వెలతె నపుడు:
"ఓయి హృదయాంతరనివాసి! యొకట, శోక
తప్తమైనట్టి నాయెద సుప్తమైన
క్రోధసర్పము మేల్కని క్రోయునాల్క
లైన పలుకటి పడగ లందంద చాఁచి
పఱచె దుర్వ్యషఫూత్కారసంక్తు, లంత
వాని నాఁజెపి నాకు సాంత్వన మొసంగి
నాఁడ, వీఁడయి క్రమ్మఱ నా యెలుంగు
నాలకింపుము; కలవు నీ కేలునందుఁ
గడిఁదియాపులు,

...ఎంచితి, నింక నీయగ్నిశుద్ధి
...చుఁగా లేదె? దుఃఖపుఁ జొత్తునుండి
...ఁ జేయవె నన్ను, నీ తెరల నెల్ల
...రించి భవద్రహస్యమ్ము కడకుఁ
...పవె యిఁక నాలసింపఁబోక."
...లు ప్రార్థించు నతని చెంగట సమర్త్రి
...ార్త స్మిత సంప్లుతం బైన మూర్తితోడ,
...కనిర్వాపకం బైన మాధ్వికతోడ
...చి యనె నిట్లు మధువాల్కునెలుఁగునందు
...యి! వగపున మరపిల్లు నీ మెలుంగు
...దే బలాత్కృత నగుచు వచ్చితి నిచటకు.
...జ్యోతిరానసఖంబుల నుండు మేము
మంటిపై నున్న మిమ్మును మఱపుసెంది
యుండు మనుకొంకు, మెవ్వఁడే డెందమందు

"పూర్వమట్టుల సత్యకాముండు నేఁడుఁ
బరులశోకముఁ బోకార్చు వ్రతమునందు
దీక్ష గొన్నియుండె, నాతనిదృష్టి నద్దు
తెరలగము లెల్ల మెల్లనఁ దెరలఁ జొచ్చె;
మధువు వర్షించె మిన్నులు, మారుతంబు
స్పర్శయందును మధువుంచె, జలములందు
మధువు స్రవియించెఁ, బృథ్వియు మధువునించె,
జ్యోతియందును దాఁపుర మున్న మధువుఁ
గిరణములు ముంచె నతని యంతరమునందు;
హృదయదహరమునందును ప్రేమ యిపుడు
పూర్ణబింబముతోడ సభ్యుదిత మయ్యె.
... వెనుకనుండి

నలందురి మెలుంగుసేయు సయ్యతని కేను
సాయ మొనరింతు, మింక దుస్స్వప్నమట్లు
మఱచిపోఁగల వీయలందురుట మెల్ల.
సౌమ్య! యీ పాత్రలోని యాసవము గ్రోలు
మామని యనారతంబు నీయందు నిలుచు,
మధుమయం బగు నింక నీమనికి యెల్ల.
ఉమ్మలిక మీఁద నచటికిఁ బొమ్ము, నీదు
నిలుప్రభూత్రాన దుఃఖము వెలలఁ గలదు."
సత్యకాముని విలులితస్వాంతమందు
నమృతలహరిని బొరలించు నాపెకంఠ
మాఁగిపోయె నదాటుగ, నాపెరూపు
తెలియకయమున్న జాబిల్లి తెలివెలుంగు
లోన గుఱుతింపరాకుండ లీన మయ్యె.

3

నాక్రమించెడు నట్టి విహ్వలత నెల్లఁ
గ్రిందు పడఁజేసెఁ దాను నిర్లిప్తుఁ డగుచు.
సత్యకాముని మనుగడ జనతయందు
జీవనదివోలెఁ బ్రవహించి సేమ మెల్ల
కడల వెదచల్లె, నాతనికడకుఁ జేరి
రెఱుకకై! శేషవల్ తపియించువార
లతఁడు పల్కినపల్కు కావ్యములయందు
దిశదిశలయందుఁ గూడ సుద్గీత మయ్యె,
సత్ప్రథానక్తు లైన రాజన్యవరులు
చేరవచ్చెద రతనియాశీస్సు గోరి;
ఇన నిత్యగవేషణావ్యగ్రమైన
యతని మన మెట్టియుపలబ్ధియందుఁ గ
... నాఁగి తాఁ గడఁక

రక్ష్యాహం మామే వాసకరో మ్యహామ్॥
నివేదయా మ్యహం సర్వా నపరాధాన్
క్షమస్వ తాన్। తేభ్యో ౽పరాధేభ్యశ్చ
త్వదన్యో మే న రక్షకః॥ సన్మార్గగామినా భ
వితుం సన్మార్గేణ నయస్వ మామ్। సన్మార్గ
దర్శకో నాస్తి త్వదన్యః పురుషః ప్రభో॥
మదీయా దుష్టచింతాశ్చ కుచర్యాశ్చ వినా
శయ। తేషాం మత్యసహర్తా త్వం త్వదన్యో
నాస్తి కశ్చన॥"

"ధర్మనిరతుఁడవై స్వర్గమర్త్యముల సృజించిన యాతని కక్షిముఖుఁడ నగుచున్నాను. నేను బహుదైవారాధకులలో నివాఁడను గాను. నా ప్రార్థన, నా త్యాగము, నా ప్రాణము, నా మృత్యువు, సర్వమును జగన్నాథుఁడగు అల్లాకే సమర్పించుచున్నాను. అతనికి సముఁడు లేఁడు. ఇట్లే నా కాజ్ఞ అయినది. ప్రణతులగువారిలో నేను చేరుచున్నాను దేవా, నీవు చక్రవర్తివి. నీవు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. నీవు నాకు ప్రభుడవు, నేను నీకు కింకరుఁడను. నాకు నేనే అధర్మముగా ప్రవర్తించుచున్నాను. నా యపరాధముల నన్నిటిని నీకు నివేదించుచున్నాను. వానినుండి నన్ను రక్షింపుము. నన్ను కొనుచున్నాను. మంచినీతిమార్గమున నడపుము. అట్లు నడపఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు. నన్ను దుర్నీతివిముఖుని చేయుము. దుర్నీతినుండి నన్ను మఱల్పఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు."

పై ప్రార్థనకు బదులుగా సాధారణముగా ఈ క్రింది చిన్నప్రార్థనను చెప్పుచుందురు.

"సుబ్హానక అల్లాహుమ్మ వ బి-హమ్ది-
క వ తబారక్-అస్మ-ఉ-క వ తా ఆలా
... వ లా ఇలాహ ఘైర్-ఉ-క అ'

త్రాతు మర్హసి మాం ప్రభో"

"దేవా, నీవు మహిమావంతుఁడవగుదువు గాక. నీవు స్తోత్రార్హుఁడవు; నీ నామము ధన్యము. నీ ప్రశ... వము నిరతిశయము. నీవు తప్ప సేవింపఁదగిన వాఁ... రుఁడు లేఁడు. సైతాను నుండి నన్ను రక్షింతువని ని... శరణుఁ జొచ్చియున్నాను."

ఈ ప్రార్థన అయినతరువాత 'ఫతీహ... చదువుదురు. 'ఫతీహా' అనఁగా కురానులో మొదటి అధ్యాయము (సూరా.)

"బిస్మిల్లా-ఇర్ రహ్మాన్-ఇర్ రహీ...
అల్-హమ్దు ఉ లిల్లా ఇ రబ్బిల్-'ఆలమీ...
అర్. రహ్మాన్ ఇర్ రహీమ్. మాలిక్
యౌమ్ - ఇద్ - దిన్ ఇయ్యాక న'బుదు...
ఇయ్యాక నస్త' ఇన్. ఇహ్దినా-స్-సి-రా...
అల్-ముస్తాఖిమ్, సి-రాత్ - అల్లజిన
"అన్ఆమ్త "అలైహిమ్ గైర-ఇల్ మఘ్-...
ఇ అలైహిమ్ వ లద్దాఅల్లిన్."

"జగన్నాథాయ దేవాయ దయాద...
మూర్తయే। ధర్మనిర్ణయకాలేచ...
ధర్మాధికారిణే। నమో౽స్తు తే ...
త్వా మహాం శరణం గతః। నేవే...
యాచేచ త్వామేవ శరణం ప్రభ...
యేన సుమార్గేణ లభంతే సజ్జ...
నగత్వా యేన మార్గేణ దుర్జ...
దుర్గతిమ్। తేనైవాపి సుమా...
మర్హసి మాం ప్రభో॥

"దయాదాక్షిణ్యమూర్తి యగు... న్నాథుఁడును, దయాదాక్షిణ్యమూర్తి... ...

# ఇస్లాములోని ప్రార్థన

చిలుకూరి నారాయణరావుగారు ఎమ్. ఏ ఎల్. టి.

స్లాములోని ప్రార్థన రెండుభాగములుగా ఉండును. మొదటిభాగమునకు 'ఫర్ట్' పేరు. 'ఫర్ట్' అనగా అందరును కలిసి డి. ఈ ప్రార్థన మసీదులో చేయడము బిది. దీనిలో 'ఇమాము' అనగా ఒక పెద్ద అధికారిగా ఉండి తక్కినవారిచేత న చేయించును. రెండవభాగమునకు న్నత్' అనిపేరు. ఇది ఎవనిమట్టుకువాడే యింటిలో చేసుకోవలసిన ప్రార్థన. రోగము గాని, మరియే కారణముచేతగాని ఎవడైనా రు సంఘముతో కలిసి చేయలేనప్పుడు, త్ వలెనే తన యింటిలో ఒక్కడే చేసు ను. ఈరెండు భాగములలోను ఆయా లలో కొన్ని 'రకత్తులు' ఉండును.

రకత్తు

క్రింద చెప్పేపనులు, ప్రార్థనలు, అన్ని రకత్తు అని పేరు:—

'కిబ్లా' అనగా మక్కా. అటునైపు ండి చేతులు చెవులదగ్గఱ చేర్చి,

'అల్లా ఉ అక్బర్'

దేవ ఏవ పరః

గా ఎడమచేతిమీద ఉంచి, ఈ క్రిందిప్రార్థన గాని, అందులో ఒక కొంతగాని చెప్పవలెను.

"ఇన్ని వజ్జహ్తు వజ్ - హాయ లిల్లజీ ఫటర్-అస్-సమావాత్. ఇ వల్-అర్దా హని ఫన్ వ మా అన మిన్-అల్-ముష్రికిన్. ఇన్న షలాతి వ నుసుకి వ మహ్యాయ వ మమాతి లిలాహ్. ఇ రబ్బ ఇల్-ఆలమిన్, లాషరీక లహూ వ బిజాలిక ఉమిర్తు వ అన మిన్ అల్-ముస్లిమిన్. అల్లాహుమ్మ అంత్-అల్-మలికు లా ఇలాహ ఇల్లా అంత, అంత రబ్బీ వ అన 'అబ్దుక జలమ్తు నఫ్సీ వ' తరఫ్తు బిజ న్బి ఫఘ్ఫిర్లి జునూబిజమి' అన్ ఇన్నహూ లా యఘ్ఫిర్-ఉజ్-జునూబ ఇల్లా అంత, వహ్దిని లి-అహ్సన్-ఇల్-అఖ్లాఖి లా యహ్దీ లి అహ్సనిహా ఇల్లా అంత, వష్రిఫ్ అన్ని సయ్యి 'అహా లాయస్రిఫు 'అన్ని సయ్యి 'అహా ఇల్లా అంత."

"స్వర్గస్యచ పృథివ్యాశ్చ సృష్టి ర్యస్మాత్ప్ర భూయతే। ప్రణిప త్యాభిముఖ్యేన వందే తం నాన్యదేవతాః॥ త్యాగశ్చ ప్రార్థనాచైవ జీవో మృత్యుస్తథైవచ। దేవాయ మమ

...థాస్తు' 'అట్లే అగుగాక!' అని చెప్ప
...రు. తరువాత బాగుగా వల్లెవేసిన కురాను
...ని ఒక 'సురా' (అధ్యాయము)ను చదువు
...రు. సాధారణముగా కురానుకొస నుండు
...న్న అధ్యాయము నొకదానిని చదవడము
...డుక. కురాను చదువనివారు 'అల్-ఇఖ్
...స్' (ఏకత్వము) అను సురాను చదువు
...దుందురు.

"ఖుల్ హువ-అల్లాహు అహద్. అల్లా
హు-ఉస్-సమద్ లమ్ యలిద్ వ లమ్ యూ
లద్. వ లమ్ యకల్ - ల - హూకుఫువన్
అహద్."

"స ఏకో దేవ స్తస్మాచ్చ స్వతంత్రో నాస్తి
కశ్చన, అజో ఽనదృశో; న కంచి జ్జన
యిష్యతి స ప్రభుః".

"దేవుఁ డొక్కఁడే అతనినుండి స్వతంత్రముగా
నుండిన దెద్దియు లేదు. అతఁడు పుట్టినవాఁడు కాఁడు,
అతనికి పుట్టినవారు నెవ్వరును లేరు. అతఁ డసదృశుఁడు'
అని చెప్పవలెను."

౩. తరువాత "అల్లా-ఉ-అక్బర్" "దేవ
ఏవ పరః" "దేవుఁడు సర్వాధికుఁడు" అని పలికి,
ప్రార్థన చేయువాఁడు తల వంచి అరచేతులు
మోఁకాళ్లపైని చేర్చినట్లు చేయును. ఇట్లు
చేయుటకు 'రుకూ' అనిపేరు. ఇట్లుండి అతఁడు
దేవునిమహిమ నీ క్రింది వాక్యములతో
స్మరించును.

'సుబ్-హాన్-అ రబ్బ్-ఇయ్-అల్-'
అజీమ్-" "జయ మే పరమప్రభో!" "పరముఁ
...

లేదా దానికి బదులుగా ...
హానక-అల్లాహుమ్మ రబ్బనా వ బిహామ్దిక
అల్లాహుమ్ మఘ్ఫిర్ లి"

"జయ దేవ ప్రభో రక్ష, స్తువే త్వామేవ
సర్వదా,"

"దేవా, ప్రభువా, నీవు మహిమావంతుఁడ వగు
దువుగాక. నీవు స్తుత్యుఁడవు. దేవా నాకు రక్షణ నొసం
గుము."

౪. పిమ్మట నిలుచుండి—

"సమి' - అల్లా - ఉ లిమన్ హామి
దహ్" "యో దేవం స్తౌతి తం నిత్యం స్వీక
రోతి ప్రభుస్సదా, తస్మా త్త్వాలయ మాం
నాథ స్వామి త్వామేవ హి ప్రభో"

"తన్ను స్తుతించువానిని దేవుఁడు స్వీకరించును.
నాథా, నీవు స్తోత్రార్హుఁడవు" అనవలెను.

౫. తరువాత సాష్టాంగపడవలెను. రెండు
పాదముల బొటనవ్రేళ్లు, రెండు కాళ్ల మోఁకాళ్లు
కులు, రెండు చేతులు, నుదురు, ఇవి నేల
తాఁకవలెను. ఈ సాష్టాంగమునకు 'సజ్దహ్'
అని పేరు. ఇట్లు సాష్టాంగపడి,

"సుబ్ హాన రబ్బియల్-అ' లా"

"జయ ప్రభో పరాత్పర"

"ప్రభువా, పరాత్పరా, నీకు జయము"

అని మూఁడు సార్లయినను అనవలెను.

ఈ క్రిందివాక్యమును పైదానికి కలుప
వచ్చును; లేదా, దానికి బదులుగా అనవచ్చును.

"సుబ్హాన-క అల్లాహుమ్మ రబ్బ-నా
బి-హామ్దిక అల్లాహుమ్-మఘ్ఫిర్ లి."

"జయ స్తవనీయ హే పాలయ మామ్

౬. తరువాత ప్రార్థనాపరుఁడైనవాఁడు
క్తియుతుఁడై కూర్చుండవలెను. ఇట్లు కూ
ర్చుంకుటకు "జల్‌సహ్" అని పేరు.

౭. పిదప రెండవసారి అయిదవపేరాలో
ప్పినట్లే సాష్టాంగపడవలెను. ఇది రెండవ
సజ్‌దహ్". అక్కడచెప్పిన వాక్యములనే
ప్పుడును అనవలెను.

౮. ఇక్కడితో ఒక 'రకత్తు' సంపూర్ణ
గును. అప్పుడు ఆరాధకుఁడు లేచి రెండవ
కత్తు' కొఱకు నిలుచుండి, మొదటి 'రకత్తు'
సినట్లే చేయవలెను. రెండవరకత్తు అయిన
రువాత మరి నిలబడనక్కఱలేదు. భక్తితో
ాఁకాళ్లపై కూర్చుండి, దైవస్తోత్రముతో
టు ప్రవక్త యగు మహమ్మదు పైగంబరు
ఱకును, ఇతరభక్తుల (ముస్లిముల) కొఱ
ను, తనకొఱకును కొన్ని స్తుతివాక్యములను
ఠించును. ఈ స్తోత్రమునకు 'తహియ్య'
ని పేరు.

అత్ తహియ్యాత్ ఉ లిల్లా ఇ వస్-
లవాత్ ఉ వత్-తయ్యిబాత్ ఉ. అస్-
లామ్ ఉ, అలైక అయ్యుహన్ నబియ్ ఉ
రహ్మాత్-ఉల్లా ఇ వ బరకాతుహ్. అస్-
లామ్ ఉ' అలైనా వ' అలా' ఇబాద్-ఇల్లా-
స్. సాలిహీన్. వ అష్-హదు అల్-లా
లా అ ఇల్ల-ల్లాహు వ అష్-హదు అన్న
ుహమ్మదన్ 'అబ్దు-హూ వ రసూలుహ్".

"పూజాః ప్రార్థనాశ్చైవ యా వాగ్భిః కర్మ

హ్యస్తు కృపా దేవస్య యే వరాః। వయం
తస్యైవ దాసా స్స్యాం ధర్మే నిత్యం ప్రతి
ష్ఠితాః॥ తస్మా దస్మాకమప్యస్తు శాంతిః;
సేవ్య స్స ఏవహి। తస్య ప్రవక్తా దాసశ్చ
ముహమ్మ దితి నిశ్చయః॥"

"మాటలచేతను, క్రియలచేతను, ధనముచేతను
చేసిన ప్రార్థనలును, ఆరాధనయు, సర్వమును దేవునికే
చెందుచున్నది. ముహమ్మదా, నీకు శాంతి యగుఁగాక!
దేవుని వరములకును కరుణకును నీవు పాత్రుఁడ వగుదువు
గాక! మాకును దైవకింకరులకును శాంతి యగుఁగాక!
దేవుఁడు తప్ప సేవింపఁదగినవాఁడు లేఁడు. ముహమ్మదు
పైగంబరే ఆతనిముఖ్యకింకరుఁడు, ఆతని ప్రవక్త."

౯. ఇప్పటికి రెండు 'రకత్తు' లగును. రెండు
'రకత్తు'లకంటె ఎక్కువ చెప్పఁదలఁచినయెడల,
తిరిగి నిలుచుండి, మొదటివలెనే ఆరంభింప
వలెను. రెండురకత్తులు మాత్రమే చెప్పఁదల,
చినయెడల, ప్రవక్తకొఱకు ఈ క్రింది ప్రార్థ
నను కూడ చేయవలెను. అంతమున 'సలామ్'
చెప్పక పూర్వము ఈ ప్రార్థనను దీని తరువాతి
ప్రార్థనను చేయవలెను.

"అల్లాహుమ్మ సల్లి 'అలా ముహమ్మ
దిన్ వ 'అలా ఆలి ముహమ్మదిన్ కమా
సల్లిత 'అలా ఇబ్రాహీమ వ 'అలా ఆలి
ఇబ్రాహీమ ఇన్నక హమీద్-ఉమ్ మజీద్.
అల్లాహుమ్మ బారిక్ 'అలా ముహమ్మదిన్
వ 'అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త
'అలా ఇబ్రాహీమ వ 'అలా ఆలి ఇబ్రాహీమ
ఇన్నక హమీద్-ఉమ్-మజీద్."

"సర్వా అపి తే స్తుతయ స్త్వైవ మహిమా

జయతు తథా తదనుసారిణః, ఇబ్రాహీ
మనుగంతారః ప్రాప్నువ న్నుత్తమా న్వ
రాన్, తథైవ ప్రాప్నుయా ద్దేవ మహమ్మ
దనుసారిభిః."

"దేవా, ఇబ్రాహీమునకును అతని ననుసరించిన
వారికిని జయము నిచ్చినట్లే మహమ్మదునకును అతని
ననుసరించువారికిని జయము నిమ్ము. నీవు స్తుత్యుఁడవు. పర
ముఁడవు. దేవా, ఇబ్రాహీమును అతనియనుచరులను
అనుగ్రహించినట్లే, మహమ్మదును అతనియనుచరులను
అనుగ్రహింపుము నీవే స్తుత్యుఁడవు, పరముఁడవు."

దీనికి క్రింది ప్రార్థనను చేర్చవలెను:-

"అల్లాహుమ్మ ఇన్ని జలమ్తు నఫ్సీ
జుల్మన్ కసిరన్ వలా యఘ్ఫిర్-ఉజ్-జునూబ
ఇల్లా అంత, ఫఘ్ఫిర్ లీ మఘ్ఫిరతన్ మిన్
'ఇందిక వర్ హమ్నీ ఇన్నక అంత్-అల్-ఘ
ఫూర్ ఉర్-రహీమ్.

"అపరాధసహస్రాణి కృతవా నస్మి కేవలమ్।
త్వం తేభ్యో ఒపరాధేభ్యో రక్షితా నో్యన
కశ్చన। తస్మా త్కారుణ్యభావేన రక్ష
మాం పరమప్రభో। క్షమాచ కరుణా చైవ
తవైవ హి పరాత్పర॥"

"దేవా, నే నెన్నియో యపరాధములఁ జేసి
యున్నాను. అపరాధములనుండి రక్షించువాఁడవు నీవే,
ఇతరుఁడు లేఁడు. కావున నీవే నన్ను రక్షించి కరుణఁ
జూడుము. క్షమించువాఁడవును, కరుణామయుఁడవును
నీవే."

దీనికి బదులుగా ఈ క్రింది స్తోత్రమును
పఠింపవచ్చును:—

"రబ్బి-ఇజ్-'అల్నీ ముఖీమ్-అస్-సలతి
వ మిన్ జుర్రియ్యతి రబ్బనా వ తఖబ్బల్ దు

పరాత్పర తథాంగీకుర్వ్వ మాంనాథ ప్రార్థనాం;
రక్ష నః ప్రభో। యదాస్మాకం పరీక్షా స్యై
ధర్మనిర్ణయతత్పరః। పరీక్షేథా స్తదా
రక్ష మాం భక్తాంశ్చ పిత్రాం స్తథా."

"ప్రభువా, నన్ను నా సంతతివారిని ప్రార్థనా
పరులనుగనట్లు చేయుము. ప్రభువా, మాప్రార్థన నంగీక
రింపుము. ప్రభువా, మా యపరాధములను లెక్కపెట్టు
కాలమున నాకును నాతలిదండ్రులకును భక్తులకును
నీరక్షణ నొసంగుము."

10. ఇంతటితో ప్రార్థన యగును. పిదప
ఈ క్రిందిరీతిగా సలాము చెప్పవలెను. ముస్లి
ములు ఒకరినొకరిట్లే సలాము చెప్పికొందురు.
సలామ్ చెప్పునప్పు డొకసారి తలను కుడిప్రక్క
కును ఒకసారి ఎడమప్రక్కకును త్రిప్పుచు
ఇట్లు చెప్పవలెను:-

"అస్-సాలాము 'అలైకుమ్ వ రహ్మత్-
ఉల్లహ్."

"దేవస్య కరుణాపాత్రో శాంతియుక్త స్సదా
భవ."

నీకు శాంతియు, దేవునికరుణయుఁ బ్రాప్తించుఁ
గాక!"

11. రెండు 'రకత్తు'లే చెప్ప నుద్దేశిం
చినవారి ప్రార్థన యింతవఱకు చెప్పఁబడినది.
కాని, మూఁడు నాలుగు రకత్తులు చెప్ప నెం
చినయెడల, 8-వ పేరాలో చెప్పినట్లు 'ఖదా'
యును, 'తహియ్యా' యును చెప్పి, తిరి
నిలుచుండి 'అల్లా-ఉ-అక్బర్' 'దేవ ఏవ పర
'దేవుఁడు సర్వాధికుఁడు' అని చెప్పి, మొద

...ము, ఆహార్యా'
ముట, ముహమ్మదు పైగంబరుకొఱకు
ర్థన మొదలగునవి, 8,9 పేరాలలోని ప్రార్థన,
రుకు 'సలాము,—ఇవన్నియు జరుగవలెను.
ఇది గాక, ఆరాధకుఁడు తనయిష్టము
న ట్లుండి ప్రార్థన చేయవచ్చును. భక్తుఁ
వాఁడు సర్వకాల సర్వావస్థలయందును
కి నమ్రుఁడై యుండును. ముస్లిములకు
న నిత్యకృత్యము. వారు నిలుచున్నను
న్నను, పరుండియున్నను, మోకరించి
ను, ఏయవస్థలో ఉన్ననునరే ప్రార్థనను
రు. ఒక ప్రక్క నుండి మఱియొక ప్రక్కకు
నప్పుడెల్ల వారు దేవుని మహిమను
ాడుచునే యుందురు. 'రుకు' (మోఁడు—
పేరా) చేసి నిలుచున్నప్పుడెల్ల 'సమి'
ు లిమన్—హామిదహ్."
స్తోతారం దేవో ఽనుగృహ్ణాతి"
న్ను స్తోత్రముచేయువానిని దేవుఁడు స్వీక
అనుమింకును.
ులుగురును చేరి సంఘముగా ప్రార్థన
ప్పుడు, అచ్చట చేరినవా రందఱును
చెప్పిన ప్రార్థనల నన్నిటిని, ఫతీ
హా చెప్పుచుందురు. 'ఫతీహా' తరు
రాము చదువు కొరాను భాగము
ాత్రము తక్కినవా రుచ్చరింపరు.
మ్రొక్కుచుండు స్థితినుండి లేచి
ల్లాహు లిమన్ హామిదహ్" అని
"రబ్బనా వ లక్ అల్-హమ్ద్ "
పేరా ౭.) అని అందురు.

చేసిన తరువాతగాని అది ఆరంభింపక పూర్వ
ము నిలుచున్నప్పుడుగాని, 'ఖునూత్' అను
ప్రార్థన చేయఁబడును. 'ఇషా' ప్రార్థనలో ఆఖరు
మూఁడు రకత్తు లప్పుడు మాత్రము ఈ ప్రార్థ
నను సాధారణముగా చేయుచుందురు. అ...
"ఖునూత్" ప్రార్థనలలో బాగుగా ప్రచార
ములో ఈ క్రిందిది ఉన్నది—

"అల్లాహుమ్—మహ్‌దినీ ఫి మన్ హదైత
వ 'ఆఫినీ ఫీ మన్ 'ఆఫైత వ తవల్లనీ ఫీ మన్
తవల్లైత వ బారిక్ లి ఫీ మా అ'తైత వ
ఖినీ షర్ర మా ఖదైత ఫ-ఇన్నక తఖ్‌దీ వ
లా యుఖ్‌దా 'అలైక ఇన్నహూ ల యజిల్లు
మన్ వాలైత తబారక్త రబ్బనా వత'ఆలైత్."

"సన్మార్గే యేగతా స్తేషాంమార్గే మామపి
చోదయ। రక్షాం తే యే గతా స్తేషాం తద్ర
క్షాం దేహి నః ప్రభో। మైత్రీం తే యే
గతా స్తేషాం మిత్రతాం మాం ప్రసా
దయ॥ యన్మాం దాస్యసి తత్సర్వం ధన్యం
మాం కర్తు మర్హతి। ధర్మనిర్ణయకాలే
చ యో దోషో దృశ్యతే మయి। క్షమస్వ
నాథ తత్సర్వం ప్రార్థయామి నిరంతరమ్।
త్వం ధర్మనిర్ణయే స్వామీ త్వాం నక
శ్చన నిందతి, మిత్రతాం యో గత స్తేన క
దాచి దపహీయతే, ధన్యోఽసి త్వం ప్రభో
నాథ దేవదేవ పరాత్పర॥"

"దేవా, సన్మార్గమున నీవు దారిచూపిన వారితో
నాకును దారిచూపుము. నీవు కాపాడినవారితోఁగూడ
నన్నును కాపాడుము. నీవు స్నేహముచేసినవారితో
పాటు నాతోఁగూడ స్నేహము చేయుము. నీవు నాకు
...

నాయందు చూచినదోషమునుండి నన్ను రక్షింపుము. ధర్మనిర్ణయము చేయువాఁడవు నీవే; నీ న్యాయమును వ్రేలెత్తి చూపఁజాలరు. నీమైత్రిని బడసినవాని కగౌరవమనున దుండదు. నాథా! పరాత్పరా! నీవు ధన్యుఁడవు."

పైదానికి బదులుగా కొందఱు ఈ క్రింది ప్రార్థనను చేయుదురు:—

"అల్లాహుమ్మ ఇన్నా నస్త 'ఇనుక వ నస్తఘ్‌ఫిరుక వ ను 'మిను బిక వ నతవక్కలు అలైక వ నుస్నీ 'అలైక్-అల్-ఖైర వ నష్కురుక వ లా నక్‌ఫురుక వ నఖ్‌ల' ఉ వ నత్రుకు మన్ యఫ్‌జురు-క. అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదు వ లక నుసల్లి వ నస్‌జుదు వ ఇలైక నస్ 'అ వ నహ్ఫిదు వ నర్జూ రహ్మతక వ నఖ్‌షా 'అజాబక ఇన్న 'అజాబక అల్-కుఫ్ఫార్-ఇ ముల్‌హిక్"

"వలవేమ త్వాం సహాయార్థం రక్షాం తే ప్రార్థయామహే। త్వాంతు విశ్వసిమో దేవ త్వయి బుద్ధిం ప్రకుర్మహే। ఉచ్చైస్తున్వేమ త్వా మేవ నమస్కారో యథావిధి। కృతఘ్నా మాభవేమ త్వ దభక్తా న్వర్జయేమ చ। సేవా మహేచ త్వామేవ త్వామేవ ప్రార్థయామహే। త్వామేవ ప్రణతా స్స్మశ్చ త్వాం శీఘ్రం శరణం గతాః। యాచేమ త్వద్దయాం నాథ దండనాద్భయాకులాః। దండనాం తవ విందంతే భక్తిహీనా స్సునిశ్చయమ్॥"

"దేవా, మేము నీ సహాయమును వేడుచున్నాము. నీ రక్షణను కోరుచున్నాము. నిన్ను విశ్వసించుచున్నాము. మాకు తెలిసిన ఉత్తమమార్గమున నిన్ను స్తుతించుచున్నాము. నీకు వందనములాచరించుచున్నాము. మేము నీకు కృతఘ్నులమై యుండలేదు. నీయాజ్ఞలను మన్నింపనివారిని విడిచిపెట్టి వారికి దూరముగ పోవుచున్నాము. దేవా నిన్నే సేవింతుము, నిన్నే ప్రార్థింతుము, నీకే నమస్కరింతుము. శీఘ్రముగ నీయొద్దకే పరుగెత్తి వచ్చుచున్నాము. నీవు మమ్ము కరుణింతువని ఆశ పెట్టుకొనియున్నాము. నీదండనకై భయపడుచున్నాము. విశ్వాసహీనులకు దండన అనుభవించుచునే ఉందురు."

ఇట్టిప్రార్థనయందు ముస్లిం మగువాఁడు తన సర్వమును దేవునిచే - నునమ్మకము గలిగి యంతయు నతనియధీనము చేయును. మనుష్యుఁడు తన సృష్టికర్తయెడల నెట్లు ప్రవర్తింపవలెనో, అతనినామము నెట్లు స్మరింపవలెనో సర్వకాలసర్వావస్థలయందును అతనిస్తోత్రము నెట్లు చేయుచుండవలెనో, ఈ ఇస్లాములో విధింపఁబడిన ప్రార్థన తెలుపుచున్నది. ఇందు ఇతరమతములకు విరుద్ధమైన ఒక్క అక్షరమును లేదు. అందుచేత, సర్వమతముల వారికిని ఈ ప్రార్థనను సామాన్యముగా విధించుట కెట్టి యాక్షేపణయు నుండఁగూడదు.



# ఆంధ్రము

కళావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

అన్నం బెక్కట లేద యాంధ్ర మన నా। కర్థంబు తానైనఁ గా
కున్నన్ నన్నయ తిక్కనెఱ్ఱనల వా।యూరించు పల్కున్న నీ
కిన్నన్ జానుఁదెనుంగు సోముల మహా।శృంగారి శ్రీనాథు ప
ల్కున్నన్ గాలి యదేల ? పోతనయుఁ బ।ల్కున్నం దలంపన్ మెయిన్.

ఇదె నావేదము శాస్త్రం, బిదె నా శాస్త్రార్థగోష్ఠి । యిదె నా కవితా
పద మిదె భుక్తియు ముక్తియు, నిదె తెలుఁగు తెలుంగటంచు। నే నాడింతున్.

అమరారామమునందుఁ గల్పకుజశా।ఖాంతంబునం దంటుఁ గ
ట్టి మధుస్యందము లందునందుఁ బరిపా।టిం జేసి పోషించి నె
య్యమునన్ గానపు దోహదం బిడి యెవం।డా యాంధ్రభాషాలతన్
దమి మీటంగను నాకెనో యతనికిన్ । నాభక్తి గీతాంజలుల్.

ఆంధ్రము నాభాష । యని యెంతు నేని నానాఁటికిఁ జాలు నా।నందమునకు
ఆంధ్రము నాదేశ।మని తలంచిన మత్త,నాగంబువలె నుబ్బు । నాదు మేను
ఆంధ్రులు నావార । లని చూడ ధృతరాష్ట్రునంతటి బలగంబు । చెంత నాకు
ఆంధ్రులు వీరు సుం।డని యెవండేని వక్కాణింప నదె నాకు । గౌరవంబు
ఆంధ్రభాష యనంగ నా।యాంధ్రభాష, ఆంధ్రదేశ మనంగ నా।యాంధ్రదేశ
మాంధ్రు లాంధ్రులటన్న నా।యాంధ్రు లహహ, కలదె నా కింతకంటెను । గౌరవంబు?
ఇఁక నెన్ని జన్మములు మా, మకజీవపు దుంపయందు । మాటువడెను యా
సకలపు జన్మమ్ములలో, నొక యాంధ్రమె వ్యక్త మగుచు । నుండు గాతన్.
రాజులందును మహా।రాజైన శ్రీకృష్ణ, దేవరాయల నామ।ధేయ మూని
మంత్రులందును మహా।మాత్యులౌ శ్రీయుగం, ధర తిక్కనార్యుల । నామ మెన్ని
సేనాపతుల దేవ । సేనాపతి ప్రత,ర్పితు ఖడ్గ తిక్కన్న । పేరు చెప్పి
కవులయందును మహా।కవివర్యుఁ డౌ నన్న, పార్య బ్రాహ్మణధుర్యు।నాఖ్య పల్కి
నదులయందును గౌతమీ।నదిని దలఁచి, దేశములయందులన్ మహా।దేశమైన
కోనసీమయభిఖ్య పే।ర్కొన్నపైని, జచ్చిపోవుదు నీయది । చాలు నాకు.

## గంజాము మండలమం దాంధ్రభాష

రుఁడు, రామోత్కర్షము వచ్చ లక్ష్మీనారాయణ కవీశ్వరుఁడు, కవీభాగవతము త్రిపురాణము తమ్మయ్యగారు, మొదలగు కవీశ్వరులు రచించి తమ కీర్తి శరీరమును నిలిపి యున్నారు. వీరల చరిత్రములతోను గంజాము మండలాంధ్రకవుల చరిత్రమును కూర్చి యాంధ్రమాతకుఁ బాదార్పణముచే సమర్పింపఁదలఁచుచున్నాఁడ. ఈయర్పణమున కాంధ్రులెల్లరు తమ పూర్వులు రచించిన గ్రంథజాలముల సహాయము మొసంగి నన్ను కృతార్థుం జేయ ప్రార్థనము.

ఆర్యులారా! చూచితిరా? మనపూర్వు లెంత శ్రద్ధాభక్తులతో నాంధ్రజననిని షోడశోపచారవిధులఁ బూజించిరో? హృదయపూర్వకముగ సేవించిరో! తెనుఁగున వ్యాకరణము, ప్రబంధములు, నాటకములు, గద్యములు, శతకములు, యక్షగానములు రచించి, యనఁగ:— సారస్వతమునకు సంబంధించిన సర్వపరికరములను సమకూర్చి కీర్తిఁ బొందిరో?

ఈకీర్తి యంతటిలో నిలిచిపోక ప్రసిద్ధకవీశ్వరులను, విమర్శకులను గంజామునకుఁ బ్రసాదించి యున్నది.

### భాషకుఁగల యిప్పటిసదుపాయములు

పల్లెపల్లెలకుఁ బోవుపత్రికలును, పురపురంబునఁ గల గ్రంథాలయములును, గ్రంథవిక్రయశాలలును, పాఠశాలలును, ఇప్పటి మన తెనుంగు భాషాభివృద్ధికిఁ దోడ్పడుచున్నవి. మండలసంబంధపత్రికలలో గతించినవి శ్రీకాకుళమున వెలువడిన కళింగయు, మొన్నటివఱకు ప్రచురింపఁబడిన యాంధ్రవాణియు, ఆంధ్రలక్ష్మియు, వేగుఁజుక్క పత్రికయు నైయున్నవి. ఇవన్నియు నిండుమనముగ దేశసేవను భాషావృద్ధికిని పాటుపడుచునవియు యున్నవి. బహుజనోపకారిణి యాంధ్రవాణి …ాణి యైనది వేఁగుఁజుక్క యుదయకాల … దాండవమాడి యొక దేశోపకారిహస్తా … ఆంధ్రలక్ష్మి …

గలవు. వీనిలోఁ గొన్ని బాలారిష్టములు పొంది జీవచ్ఛవములై యున్నవి! టెక్కలి కాళిదా… లయములవంటివి తుపానుదెబ్బలు తిన్నను … మున శిథిలస్థితిలోనున్నవి. మొత్తముమీఁద … లయములవలన భాషావ్యాప్తికి సదుపాయ… చున్నదని యుత్సాహముతో వ్రాయవచ్చు… విక్రయశాల యొకటి కూడలి తావునందుంటి… మున లేదు. ప్రతిష్ఠలమున నున్నతపా… పాఠశాలలు, నేలంటుబడులు లున్నవి. కా… కొంతవాసటు వానివలన వాటిల్లుటు గురుదు… చున్నది.

మండలసంబంధగ్రామచరిత్రములు యున్న కవుల గ్రంథములు, శాసనాదికములు లకు, కీ॥ శే॥ క. వీరేశలింగ పండితులు వడిసం… లేక, లభ్యము కాఁగలవు. ఆంధ్రభాషాభి… సమస్తరహస్యములను భాషాసంస్కర్త గా… గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి… ములవలన సందులకు సులభముగ తెలియఁబడ… గీర్వాణాంధ్రములందును, గానకళయందు… పాండిత్యము కలిగిన బ్ర॥ బంకుపల్లి మల్లయ… వంటి బుధవరేణ్యులవలన భాషార్థుల కభిమత… చున్నవి. కవిగ్రామణి, పండిత త్రిపురాన… రావుసాహెబుగారివంటిప్రౌఢకవులవలన నాంధ్ర… సంపద శోభిల్లుచున్నది. సువిమర్శకులును … పండితకుటుంబస్థులైన మండపాక పార్వతీశ్వ… గారివంటి పరిశోధకులవలన భూగతద్రవ్యములు బయనట్లు ఖిలగ్రంథసామగ్రి యన్వేషకులకు… చున్నది. వీరందఱు సారస్వతసర్వస్వమునను వ్రాసినచో ముఖస్తుతివాక్యము గాక యథార్థవాదమ… కాక మానునా!

### ఉపసంహారము

...బ్రబలోదాహరణముగ నున్నది. అయినను ప్రసాదగుణములు సద్గ్రంథములు రచించి మాతృ...ందంజ వేయవలసియున్నది. గ్రంథాలయముల...లు జరుగుచుండవలెను. ప్రజలు గ్రంథా...దించి పూజింపవలెను. పంచాననవంటి..., ఆయుర్వేదపత్రికను బోలు విజ్ఞాన ప్రవర్తనపత్రికలును బయలు వెడలవలసి యున్నవి. ఎల్ల పాఠశాలలలోని విద్యార్థులు మాతృభాష నూరక నేర్చిన వారుగాక యాంధ్రికి సత్సంతానము గావలసియున్నది. ఈ కొంతెపకోరిక లన్నియును జేజగద్వంద్యుడో, ధర్మమూర్తియో, యే దివ్యరూపుడో ఫలోన్ముఖముగ జే దెప్పును గాక! ఈశ్వరుడాశీర్వదించును గాక!

---

# ఏకాంత సుఖము

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు బి. ఏ.,

ఈయడవి దాగిపోనా?
ఎట్లైన
ఇచటనే ఆగిపోనా?

...ఆకునై
...లో పూవునై
...మ్మలో కొమ్మనై
...మలేత రెమ్మనై
ఈయడవిదాగిపోనా
ఎట్లైన
ఇచటనే ఆగిపోనా ?

...లగలని వీచు చిఱు
...గాలిలో కెరటమై,
...లబలని పాడు
...లపాటలో తేటనై

తరులెక్కి యలసీల
గిరులెక్కి మెలమెల్ల
చదలెక్కి జలదంపు
నీలంపునిగ్గునై
ఈయడవిదాగిపోనా
ఎట్లైన
ఇచటనే ఆగిపోనా ?

అకలా దాహమా
చింతలా వంతలా
ఈకరణి వెఱ్ఱినై
ఏకతమ తిరుగాడ ?
ఈయడవి...

# మాయింట్లో పిల్లి

("మారుతి" - సాహితీసమితి)

పిల్లులకీ యితర జంతులకీ తెలివితేటలు లేవనీ, ప్రపంచంలో వున్న తెలివితేటలన్నీ మనిషిలోనే మూర్తీభవించినవనీ, చెప్పేవాళ్లకీ నాకూ స్నేహంలేదు. అలాగని చెప్పి అన్ని జంతువులతోటీ నేను నేస్తంకట్టను. ఆమాట కొస్తే కుక్కకీ నాకూ పరమశత్రుత్వము. కారణము—కుక్కకూ ఇంగ్లీషువాడికీ పరమస్నేహం కాబట్టి.

పిల్లిమీద నాకు ఒకమోస్తరు కోపం. అయినప్పటికీ దానిమీద అభిమానం లేకపోలేదు. ఏమంటారా మా మేనత్త—ఆవిడకు నేనంటే చాలా మమకారం. నేను వాళ్లింటికెప్పుడు వెళ్లినా చాలా ఆదరించి, వచ్చావా నాయనా అని, నాకు జంతికలుచేసి పెట్టుతుంది కాబట్టి—ఒకపిల్లిని పెంచుతుంది. అన్నట్టు చెప్పడం మరిచిపోయాను; మా మేనత్త వితంతువు. వితంతువులకీ పిల్లులకీ ఒకమోస్తరు సంబంధం వుండివుండాలి; ఈ జన్మంలో కాకపోయినా పూర్వజన్మంలో నైనాను. లేకపోతే, వాళ్లిద్దరికీ యింతటి మక్కువ ఎందుచేతనో నాకు బోధపడడంలేదు. నా అదృష్టమేమో కాని—దురదృష్టం అనండి. మాయింట్లో నల్లపిల్లీ, పొడలపిల్లీ, పిల్లికళ్లపిల్లీ, ఇంగ్లీషు పడుచుల్లాగ నీలికళ్లపిల్లీ—ఏదో ఒక పిల్లిని పెంచడమే చూచాను. వెనకటికి ఎవరో ఒక యిల్లాలు వుండేదిట, మా మేనత్త చెప్పేది. ఆవిడకు పెంచుతూన్నపిల్లంటే ప్రాణం. వారానికొకమారు దానికి నూనెరాసి కుంకుడుకాయ పులుసుతో రుద్ది తలనీళ్లుపోసేదిట! చెవ్వలో నూనెకూడా పోసేదిట! మధ్యాహ్నం వంట చేసుకొని, తానింత తిని పిల్లికింతపెట్టి, వీధి అరుగుమీద కూచుని, చేటలో పెసరపప్పు ఎండలో పెట్టి, పిల్లిని ఒళ్లో కూచోపెట్టుకొని, కాకుల్ని కొట్టుతూ, గులివితెడ్డుతో గులివి తీసేదిట! ఎంత మమకారమో! అయితే స్వేచ్ఛకోరి, యిష్టానుసారం తిరిగి, మనుష్యులను లక్ష్యపెట్టని, పిల్లి యిన్ని విధాలుగా యిబ్బంది పెట్టుతూవుంటే ఎలాగ వూరుకుందో అనుకుంటాను. కాని యీపిల్లి సామాన్యపు పిల్లి కాకపోవచ్చును. పూర్వజన్మంలో, బహుశా యీ వితంతువుకు దగ్గిరబంధువని మాత్రము నానిశ్చితాభిప్రాయం. ఎలకలని పట్టి చంపడానికని పిల్లిని పెంచుతారుగాని, వాస్తవాని పిల్లి ఎలకలని పట్టదని నా నమ్మకం. తినడాని

న్నచోటే ఎలకలు ఎక్కువగా వుంటాయి.
వునిండిన పిల్లిదగ్గర ఎలకలు తైతక్క-
డతాయి.

ఈసంగతి ఒకదేశపు గవర్నమెంటువారు
గా గ్రహించినట్లు తోస్తుంది. ఆ మధ్య
తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తూ
-వ ఉద్యోగస్థుల జీతాలూ స్కూలు
ర్లి జీతాలూ తగ్గించారు. ఆరీతిగానే
కిచ్చేభత్యంకూడా తగ్గించినట్లు తెలియ
ంది. ఏదో వూళ్లో ఏదో ఆఫీసులో ఎల
విస్తారముగా వున్నాయిట. ఆ ఎలకల
పడలేక, ఆఫీసులో ఒకపిల్లికి ఉద్యోగం
చ్చేరట! ఆపిల్లి యథావిధిగా తన
ధర్మము నిర్వహిస్తూ, దొరతనము
వేతనరూపకముగా యిచ్చే భృత్యము
స్తూ, లోకముతో సంతృప్తి జెంది
ట. ఆ మధ్య జీతములు తగ్గిస్తూ పిల్లి
మును ఆ దొరతనము తీసివేసినారు.
గా అన్నారట, "ఎలకలను తినే పిల్లికి
హారంకోసం భృత్యమెందుకు? భృ
ఆహారము కొనివేస్తే అది మళ్లీ ఎల
ట్టదు కాబట్టి, ఎలకలను ముట్టనిపిల్లి
ందుకు?" అని. ఆమాట నిజము. ఇం
ంకో విశేషం వుంది. జీతములు తగ్గు
బాధపడుచున్నవాళ్లము, స్కూలు
, మేమొక్కరమే అని వాళ్లు విల
వాళ్లకు సహవాసంగా పిల్లికూడా
ఈమార్జాలసహవాసమును స్కూ-
...

సంతోషిస్తూ, వారియెడల కృతజ్ఞత కలిగి వుంటారని నేను దృఢముగా నమ్ముచున్నాను. ఇట్లా వున్నట్లయితే వారికి కుక్క మున్నగు యితరజంతువుల సహవాసముకూడ అచిర కాలములోనే సమకూరగలదని నమ్ముచున్నాను. మామేనత్తమీద నాకు మక్కువ. ఆకారణంచేత అవిడిపిల్లిమీద నాకు అభిమానం. ఎంత అభిమానం వున్నా రాత్రి భోంచేసి, పరుపు వేసుకొని పండుకొని, మంచి నవల చదువుకుంటూవున్నప్పుడు, సద్దులేకుండా వచ్చి భ్రష్టుపిల్లి—వెధవపిల్లి — పక్కను పడుకొని, గుర్రుమంటూంటే, ఎవళ్లకి ఒళ్లుమండుకుపోదు— విశంతువులకు తప్ప. ఆసంగతి అలా వుండగా శుభ్రంగా అరటిఆకు వేసుకొని, యిష్టమైన పదార్థాలు ఆప్యాయంగా తినే సమయాన్ని, ఎదురుగుండా కూచుని ఈపిల్లి రెప్పవెయ్యకుండా చూస్తూ, నీవు తినే అన్నంముద్దలు లెక్కపెట్టుతూంటే, ఒళ్లు మండుకుపోతుందా పోదా? ఏమంటారా,—మనం హిందువులము కాబట్టి, దృష్టిదోషం అంటే నమ్మకం యింకా పోలేదు. పచ్చకళ్లతో యీ పిల్లి యీ విధం గా చూస్తూంటే, దృష్టిదోషం తగలదని ఎలాగ అనుకోగలము? అన్నం అరగిక అజీర్ణ రోగము రాదని ఎలాగ అనుకోగలము? ఆ సమయంలో, పక్కనున్న నీళ్లచెంబు తీసుకొని మొహంబద్దలగొట్టవలె నని బుద్ధి పుట్టక పోదు. నీళ్లచెంబంటే జ్ఞాపకం వచ్చింది. పిల్లి అంటే నాకు కోపానికి ఒక కారణం వుంది.

..ని చూచి అసహ్యించుకోవడం అనేగుణం కుంది. దాన్నంతా యిప్పుడు కడుక్కో చావాలి. ఆ అంటమూతితో ఊరగాయల కుండ ముట్టుకుంటే ఇం కేమేనా వుందా?" ఇత్యాదిగా గబగబ ఒక ఉపన్యాసం యిచ్చి చెంబెడు నీళ్లు తరుముకువెళ్లి దాని నెత్తిమీద పోసి దావిడచచ్చి స్వర్గాన్నుంది. అంట మూతిపిల్లికి, ఆ చెంబెడు నీళ్లతోనూ శుద్ధి అయ్యేది. ఒక్కొక్క గండుపిల్లి తప్పించుకు పోయేదికూడాను. ఆ సందర్భంలో మా అమ్మకు కోపమూ దుఃఖమూ ఇంతా అంతా కాదు. ఎంచేతనంటే—ఈ వెధవపిల్లి ఊరూ వూ ఇళ్లిల్లూ తిరిగి, అందరి ఎంగిళ్లూ కలిపివేసి, ఆ ఎంగిలి మాయింటికి మళ్లీ తీసుకు వస్తుందని. మా అమ్మ అప్పుడప్పుడు పిల్లిని పట్టుకోడానికి ప్రయత్నించేదికూడాను. ఖర్మంచాలక ఏదేనా ఒక పిల్లి దొరకినట్లయితే దాన్ని బిందెలో వేసి, బిందెనిండా బట్టలు వేసి, నీళ్లకు వెళ్లే టప్పుడు కాలవకు తీసుకు వెళ్లేది. అక్కడ ఆ పిల్లిని వదలిపెట్టి, రెండుదాన్ని తిట్టి, బట్టలు వుతుక్కొని, స్నానంచేసి, మడినీళ్ల బిందెతో యింటికి వచ్చేది. ఇంట్లోకి వచ్చి, నీళ్లబిందె దింపి "విరగడైందమ్మా వెధవపిల్లి" అనేది. అని అనడంతోనే మ్యావని ఆపిల్లే గదులో పెట్టెమీదనుంచి దిగి ప్రత్యక్షమయ్యేది.

ఏలాగైతేనేమి నాకు పిల్లిమీద కోపా నికి మా అమ్మే కారణం. ఇక మా పిల్లి సంగతి. మా అమ్మ బతికివున్నన్నాళ్లూ మా యింట్లో పిల్లి కాలుపెట్టలేదు. దరిమిలాని ఒక

...రోయూక, ఒక తెల్లపిల్లిపిల్లని మా యింటి
...గ్గిర వప్పగించింది. దాన్ని పూర్వపు అల
...ాటును బట్టి తరిమి వెయ్యడానికి ప్రయత్నం
...శాము. ఎంతచేసినా, మాయిల్లు మాత్రం
...ది వదిలీదికాదు. ఇల్లంతా కర్ర తీసుకు
...మి, ఇంట్లోంచి వెళ్ళిపోయిం దని అనుకుం
...ాంతే, ఏబుట్టలోంచో, ఏపొయ్యి పెడ
...ంచో, ఏ అలమారు లోంచో మ్యావు
...దేది. దాన్ని తరిమీమార్గం దొరక్క,
...మా అమ్మ లేదుగదా పిల్లి వుంటే ఏమి
...యుందని వూరుకున్నాం. ఊరుకోవడానికి
...కో కారణంకూడా వుంది. మా చంటమ్మా
..., యీపిల్లిపిల్లకీ, ఒకవిధమైన స్నేహ
...ంది. మా అమ్మాయిదగ్గిరకు వెళ్ళి తోక
...నా, చెవులు పీకినా, ఊరుకునేది ఈపిల్లి.
...ంవరమేనా దగ్గిరకు వెళ్ళితే మాత్రం
...పోయాది. కొత్తలో మా అమ్మాయి,
...వింతగా చూచేది కాని దగ్గిరకువెళ్ళేది
.... రానురాను దానిదగ్గిరగా వెళ్ళి దాని
...ఆడుకొనేది ఒక ఆటబొమ్మతో ఆడుకొ
... అంటే జ్ఞాపకంవచ్చింది. ఒకనాడు ఒక
... చంటిపిల్లను చంక బెట్టుకొని, చుట్టపు
...కు వచ్చింది మాయింటికి. చంటిపిల్లను
... వదలి, ఆవిడ మాఅమ్మాయితల్లితో
...ముందర కూచుని కబుర్లు చెప్పుతోంది.
...అమ్మాయి చంటిపిల్లను చూచి దగ్గిరగా
...

...ఇద్దరూ కొంచెం ఎడంగా కూచుని
...రు ...

తాకినారు. తరువాత ఒకరినొకరు లాగిచూచుకున్నారు. చివరకు ఒకరినొకరు ఒకబొమ్మగా నిశ్చయంచేసుకున్నారు. చేసుకుని ఒకరిజుట్లు ఒకళ్లు పట్టుకుని లాగుకోవడం ప్రారంభించారు.

"ఊఁ"

"ఊఁ"

"ఊఁ ఊఁ"

"ఊఁ ఊఁ"

తరువాత రోదనాలధ్వని విని ఇద్దరు పిల్లలనీ, తల్లులు విడిపించారు. ఆచంటిపిల్లలాగ యీపిల్లిపిల్ల, మాఅమ్మాయితో కలియబడి దెబ్బలాడలేదు. అందుచేత ఆపిల్లిపిల్ల దగ్గిర మాఅమ్మాయికి చనువు.

ఈ పిల్లిపిల్లను యింట్లో వుంచడానికి ఇంకోకారణంకూడా కద్దు. మా అబ్బాయికి కూడా ఈపిల్లిపిల్లంటే ఎంతో సరదా. పిల్లిపిల్లకు మాత్రం మావాడంటే అతిభయం. పిల్లిపిల్ల నెమ్మదిగా ఒకమూల కూచుని, హాయిగా కళ్లుమూసుకొని, ప్రపంచాన్ని మరిచిపోతూన్న సమయంలో, మావాడు నెమ్మదిగా దానివెనకాతే వెళ్ళి తోక లాగుతాడు. అది ఏమి జరిగిందో గ్రహించలేకది క్కాలోచకుండా పరుగెత్తుతుంది. మావాడు గంతువేసి నవ్వుతాడు. ఒకొక్కప్పుడు పిల్లిపిల్లని కర్ర పుచ్చుకొని యిల్లంతా తరుముతాడు కూడాను. మావాడికి పిల్లిమీద ఎంత అభిమానం అంటే—

ఒకనాడు "ఒరే అబ్బాయీ, వంటిం

